The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper
for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

తూప్రుబజారు, హైదరాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

| | | |
|---|---|---|
| సం॥ చందారూ ౬-౦-౦<br>అర్ధ ,, ,, ౩-౦-౦<br>విడి ప్రతిక ౦-౧-౦ | **GOLKONDA PATRIKA**<br>HYDERABAD, Dn. MONDAY 28-5-1934<br>103458 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

సంపుటము ౯ } శా.శ.౧౮౫౬ శ్రీ భావనామసం॥ నిజవైశాఖశు॥౧౫ సోమవారము ౨౩-౭-౪౩ఫ. { సంచిక ౬




## పురపాలక సంఘపు ఎన్నికలు

## ఆంధ్రుల అశ్రద్ధ

. రా. రా. గోల్కొండ పత్రికాధిపతిగారికి

అయ్యా,

హైద్రాబాదు నగరపు పురపాలకసంఘముయొక్క ఎన్నికలు ఈసంవత్సరాంతమున జరుగనున్నవి. నగర పౌరులపక్షమున ౧౩ గురు అభ్యర్థు లెన్నుకొన బడుదురు. ఎన్నికల ప్రచారము ప్రారంభమైనది. పలువురు ప్రముఖులు తమ పేర్లు ప్రకటించియున్నారు. ఎన్నికల సభలు ఉస్మానియా పట్టభద్రుల సంఘమువారును, ఇతరులును జరుపుచున్నారు. ఓట్లు [సమ్మతులు]తమకే నొసగవలయునని పుస్తకములపై సంతకముల నుగొనుచున్నారు. కొందరు అభ్యర్థులు తాము సభ్యులగుచో జేయుకార్యక్రమమును ప్రకటించియున్నారు. తాము నగరవాసులకెట్టి సౌకర్యములను గావించెదరో సూచించుచున్నారు. ఇదిమనకు ప్రథమప్రయత్న మగుటచే అంతఅలజడిలేదు. దీని ప్రాముఖ్యత దెలిసినపిమ్మటగాని ప్రజలలో అలజడికలుగక మానదు.

ఈ సందర్భమున ఒకవిషయము మాత్రము గమనార్హమై యున్నది. హైదరాబాదునగరము ఆంధ్రప్రాంతములో నున్నది. దాదాపు నగము ప్రజలు ఆంధ్రులే. అయినను ఆంధ్రులలో నీయెన్నికలగూర్చి యేలాటిసంచలనము కలుగలేదు. వారీపురపాలక సంఘమును బహిష్కరించినటులే తోచుచున్నది. ఒక కృష్ణస్వామి ముదిరాజుగారు మాత్రము అభ్యర్థిగానిలిచినారు. దీనికికారణమేమో దెలియజాలకున్నాను. ఆంధ్రులలో పురపాలక సంఘవ్యవహారములు దెలిసినవారు లేదనజాలము. మ. రా. మందుముల నరసింగరావు, బూర్గుల రామకృష్ణరావుగార్లవంటి సమర్థులుగలరు. మ. రా. మాడపాటి హనుమంతరావు పంతులుగారివంటి ప్రముఖులు పూర్వము ప్రభుత్వముచే సభ్యులుగా నెన్నుకొనబడినవారు గలరు, విద్యావంతులు పెక్కురుగలరు. “స్వపరిపాలనము, స్వపరిపాలనము” అని ఉపన్యాసవేదికలపై బల్లగుద్దిచెప్పినవారు నేడుమౌనమువహించుచేలకో? ఇదిఅంతయు ఆంధ్రులు వాక్శూరుల నటకేనా?

ఆంధ్రసోదరులారా! ఒకవిషయమును జ్ఞప్తికి దెచ్చుకొనుడు. కీర్తిశేషులైన చేకుమాలరంగరావుగారు పురపాలక సంఘ చిత్తుశాసనము తయారుచేయగ దానిలోచేయవలసిన మార్పులు సూచించి చిత్తుశాసనము త్వరలో శాసనరూపము దాల్చుటకై ప్రయత్నించియుండిరి. వారు ఆంధ్రులనునది మనకు దెలిసినవిషయమే. పురపాలక సంఘ సభాసదులుగానున్నపుడు మ. రా. మాడపాటి హనుమంతరావు పంతులుగారు ప్రస్తుతము అమలులోనుంచబడిన శాసనమును త్వరలో అంగీకరించవలయునని అనేకపర్యాయములు వ్రాకుచ్చియుండిరి. రయ్యతుపత్రికా సంపాదకులగు ఎం. నరసింగరావుగారు పూర్వమునుండియు ప్రజల ఆరోగ్యము మున్నగు విషయములగూర్చి తమపత్రికయందు ప్రాముఖ్యత నొసగుచున్నారు. ఈవిధముగ ఆంధ్రులు ప్రయత్నముసల్పి తుదకు శాసనము అమలు లోనికి౭-౫ సభాసదులగుటకు ప్రయత్నించిక మౌనమువహించుటేల?

నిజము విచారించిన ఆంధ్రజనసంఘ పక్షమున యెన్నికలకు నిలబడవలసిన అవసర మెంతేనిగలదు. దీనిచే ఆంధ్రజనసంఘముయొక్క ప్రాముఖ్యత వెల్లడియగుచుండెడిది. నిర్జీవమగుచున్న సంఘము సజీవమై దేశమునకును ప్రజలకును మేలుకలిగించెడిది. ఆంధ్రజనసంఘముయొక్క అవసరముకూడ ప్రజలకు విదితమయ్యెడిది. కాని మౌనమువలన అన్నియాశలు అడుగంటుచున్నవి. ఆంధ్రజన సంఘముకూడ [illegible] పోయని భీతికలుగుచున్నది.

మనము ఉస్మానియా పట్టభద్రుల సంఘమునుండి గుణపాఠము నేర్చుకొన వలసియున్నది. మ న ప్ర భు త్వ ము వా రు పట్టభద్రులకు ప్రత్యేకముగా నొకస్థానము నొసగియున్నారు. పట్టభద్రులు సమ్మతి నొసగుటకర్హులనికూడ నిర్ణయించినారు. వారు ౧౩ స్థానములకుకూడ పోటీ చేయుచున్నారు. దీనిచే వారికి స్వపరిపాలనముగూర్చి గలశ్రద్ధ తేటతెల్లమగుచున్నదికాదా!

ప్రజలకు పురపాలక సంఘమున తగినఅధికారము దొరకలేదనుట సత్యదూరముకాదు. ప్రజల సంఖ్యననుసరించి ప్రాతినిధ్య మొసగబడలేదనుట నిశ్చయమే. నగరముయొక్క విద్యుచ్ఛక్తి, నిర్మాణము, విద్యకు సంబంధించిన విషయములకు ప్రత్యేక ప్రభుత్వశాఖలున్న మాట నిజమే. అయినను ప్రభుత్వమువారు ప్రసాదించిన కొలదిపాటి అధికారమును ఏలవినుయోగించుకొనరాదు? సభావ్యవహారములందు పాల్గొని అధికారము హెచ్చించుటకై యేలపోరాడరాదు? ఆంధ్రులలో జాతీయాభిమానము మెండు. సహాయ నిరాకరణోద్యమమువలన ప్రభుత్వ సంస్థలను బహిష్కరించిరని అనుకొనినను ఇవుడుకాంగ్రేసు సంస్థయే శాసనసభకు బోవుచున్నది. ఎన్ని విధములజూచినను నాకు ఆంధ్రులు ఎన్నికలకు నిలువబడకపోవుటకు కారణమేదో తెలియుట లేదు. ఎవరైనదెలిపిన కృతజ్ఞుడను.

ఇంకను సమయము మించిపోలేదు. ప్రచార మారంభించినచో నగము స్థానములైనను బడయవచ్చును. ఇకనైనను ఆలోచించి కార్యమునకు దిగెదరని ప్రార్థించుచున్నాను.

౧౮-౮-౪౩. (ఒకపౌరుడు)

---



### వైదికధర్మ పరిపాలకుని మరణము

మ॥రా॥శ్రీ గోలకొండపత్రికాసంపాదకుల సముఖమునకు:—

అయ్యా!

మీ పత్రిక చందా దారుడగు రా. శ్రీ నందిగామ మోనయ్యగారు అధిక వైశాఖ బ॥౧౩ లక్ష్మీవారము ఉదయము ౧౧ గంటలకు ఫీలుఖాన కమాలుఖాన్ దేవిడివద్ద నొకటాంగాతో తగులుకొని ఆగాయముచే నొకరాత్రియంతయు ఉస్మానియాదవాఖానాలో ఆయాసమునొంది తెల్లవారిఉదయము ౭ గంటలకు పరమపదవినొందినారు. వీరి దేశాభిమానము మతాభిమానము వీరు యేర్పాటుచేసినటువంటి గొప్పపుస్తక భాండాగారము, మరియు యితరగొప్పయుపకారములచే ప్రఖ్యాతినొందిన యీ వైదికధర్మ పరిపాలకుని చరిత్ర మీయొక్క పత్రికద్వార యెల్లరకు వెల్లడిచేయ ప్రార్థించు చున్నాడను.

ఇట్లు
[illegible] సత్యయ్య

---

## పత్రికాభిప్రాయములు

## సంస్థానాధిపతులు, వారి సమస్యలు

పైశీర్షిక క్రింద ౨౮ మే ౧౯౩౬ నాటి "టై" పత్రిక బొంబాయిలో సంస్థానాధిపతుల సమావేశ సందర్భమున క్రింది అభిప్రాయమును ప్రకటించినది. ఆ సమావేశమునకు హి. ఘ. హ. నిజాం రాష్ట్రము తరపున ఆర్థిక శాఖామంత్రివర్యులగు నవాబు సర్ అక్బర్ హైదర్ నవాజ్ జంగు బహదర్ గారు, భూమ్యాదాయ శాఖా మంత్రివర్యులగు శేట్ల్యాండ్, గ్రెంచ్ గారితోను, రాజకీయ శాఖామాత్యులగు నవాబు మెహదీయార్ జంగు గారితోను హాజరైయుండిరి—

మన సంస్థానాధిపతులు బొంబాయిలో అనుకూలమైన వాతావరణములో మరియొకసభ చేయుచున్నారు. వార్తలనన్నిటిని బట్టిచూడగా వారింకను తమ తాతల కాలమునాడువలె వినుగు లేక రాజకీయరసాయనమును వెదకుచున్నట్లున్నది. ఆ రసాయనములో వివిధప్రమాణములుగా కలిపి నూరబడిన వస్తువు లేవనగా, ఫెడరల్ రాజ్యాంగమందు విశ్వాసము - తమ రాష్ట్రముల హద్దులలో తమ సర్వాధికారమునకు భంగములేకుండ సంరక్షించుకొనుట - ఖండితముగా ఇట్లు చేయవలసినదని కఠినమైన ఆజ్ఞలను సార్వభౌమునివలన తమకు రాకుండునట్లు చేసికొనుట తమలో మాత్రము పెద్ద చిన్న అనుభేదమును ఎప్పటివలెనే యుంచుట— ఇవి. పలుమారు సమావేశపరుపబడు ఈ మహాసభలకు అవసరమగు యుక్తియు, ప్రయాసయు (ప్రణితులవలె కష్టస్థితిలోనున్న సంస్థాన ప్రజల భావములయెడల మర్యాదకైమేము ద్రవ్యనష్టమేవిష యము మాత్రము ఏమియు చెప్పము) చాలా ఎక్కువ.

మన సంస్థానాధిపతులకును, వారి మంత్రులకును వారి ప్రయత్నములవలన సంతోషము కలుగుగాకయని మేము కోరుచున్నాము. మన ఈ దేశము దాని ప్రాచీనతనుబట్టియు, జనసంఖ్యనుబట్టియు, సంపదనుబట్టియు ఆక్రమించుకొనదగిన స్థానమును ఆక్రమించుకొనునట్లు చూడవలయునను మన ఆశను సాధించుటలో భారతీయుల భారతదేశ మనబడు సంస్థానముల పరిస్థితులు ఒక గొప్ప ఆటంకమని విశ్వసించువారిలో మేము చేరినవారము. సంస్థానాధిపతులను నిందపాలుచేయుట సులభమని ఒకరు చెప్పినమాట సరిగా నున్నది. వారు తమను విమర్శచేయుటకు అనేకములగు అవకాశముల నొసగుదురు. అయిననుమన సంస్థానాధిపతులను తక్కువచేయుట ఏ భారతీయునకైనను సంతోషము కాదు. రాష్ట్రముయొక్క యేఅంగముగాని ఉపయోగకరముగా నుండుటకు ప్రజాసామాన్యముయెడ చేయవలసిన విధియు, ఆవిధి మెల్లుచక్కగాను శ్రద్ధతోను నెరవేర్పబడవలసినదియు గ్రహించియుండుట ముఖ్యము. నేటికాలపు జీవితములును అభిప్రాయములును ఈతత్వమును స్పష్టపరచుచున్నవి. మన సంస్థానాధిపతులు ఈతత్వమును గ్రహించిరో లేదో సందేహము. ఇపుడు బొంబాయిలోకూడి యున్న ఘనతవహించిన ప్రభువులును వారి మంత్రులును ప్రస్తుతపరిస్థితులను సూక్ష్మముగా గ్రహింపవలసియున్నది. అట్లు గ్రహింపగలుగుటకై ఈమధ్య మన సంస్థానములలో అసహ్యకరములగు పరిస్థితులతో నిండిన యొక సంస్థానమునుండి వెలువడిన దుఃఖకరవార్తను అందరిదృష్టికి దెచ్చుచున్నాము. ఇదిర్ఘాబువా మహారాజాగారి అంతఃపురమునుండి తప్పించుకొనుటకై పన్నబడిన యుక్తిగాదు. బలాత్కారముపై తీవ్రమైన మనోవేగన నమభవించవలసి వచ్చిన మహారాణియొక్క దుఃఖము అది. "బలాత్కారముపై ఖైదీజీవితము ననుభవించ వలసినట్టియు, చాలా నీచమైన భోజనమును పొందుచు, మిక్కిలి అవమానము కలిగించు దాసీలచే చుట్టబడినట్టియు" ఒక రాజభార్యయొక్క స్థితినిగూర్చి ఆలోచించుడు. ఇట్టివే మఱికొన్ని గొప్పనేరము లారోపించబడినవి. ప్రభువుయొక్క అత్యాశనుగూర్చియు, నిరంకుశాధికారమును గూర్చియు అనేకపర్యాయములు చెప్పబడినట్టులే యిపుడును ఈ నేరములో చెప్పబడియున్నది.

ఇటువంటి ఉదాహరణములను మన సంస్థానములలో అనేక సంస్థానముల నుండి పేర్కొనవచ్చును. సంస్థానాధిపతులిపుడు తమతమ యిండ్లను చక్కబెట్టుకొనుటకు మాఱుగా తమతమ ప్రజల నిర్బంధములను స్థిరముచేయుటకై ఒకరితోనొకరు పోటీచేయుచున్నారు; ఈవిషయమై వాస్తవము సంస్థానముల వెలుపలికి పోకుండునట్లు మార్గములను ఆలోచించుచున్నారు. సంస్థానములన్నియు ఈప్రకారముగా అసహ్యకరములైన లోపములకు తావుకాదని మేము సంతోషముతో అంగీకరించెదము. అయినను పెద్దపెద్ద సంస్థానాధిపతులు పరిస్థితులను విమర్శించుటకు సమావేశమైనపుడు విషయముల లన్నింటిని విచారించి తమతమ దురభ్యాసములను సంస్కరించుకొనని సంస్థానాధిపతులపై తమ పలుకుబడిని వినియోగించుట తగియున్నది.

ఇటువంటి ముఖ్య విషయములలో సంస్థానాధిపతులు ఒకరితోనొకరు నేరుగా మాట్లాడుకొనకుండ సార్వభౌమ ప్రభుత్వపు అధికారము ఆటంకము కలిగించుచున్నదని మాకు తెలియకపోలేదు. వైస్రాయిగారి దారాలకును, పోలోఆటకును ఏర్పాట్లు చేయుటకు వారికి అనుమతిగలదు. అయితే పరిపాలనకు సంబంధించిన ముఖ్యవిషయములలో మాత్రము ఈ సూర్యచంద్ర వంశజులపై పొలిటికల్ ఏజెంటు యొక్క అధికారమే యెక్కువ. ఈసార్వభౌమాధికారము ఈ విషయములలో ఒక స్పష్ట నిర్ణీతపద్ధతి ప్రకారము పనిచేయునను మాట వాస్తవమే. డార్విసుగారి (యవోల్యూషను) సిద్ధాంతము పనిచేయుచున్నట్టి యీ కాలములో ప్రభుత్వములవంటి ప్రభుత్వములనే నేటిప్రపంచములోను నిల్పియుంచుటవలన సార్వభౌమాధికారముగలవారికి లాభముగలదు. దానికి అవసరమైనపుడే అవి జోక్యము కల్పించుకొనును. ఎటువంటి విషయములలో ఆ అధికారస్థులు జోక్యము కల్పించుకొనుట అవసరమని తలంతురో వాటిని వారినిపుట్టించిన బ్రహ్మకూడ ముందుగా కనుగొనలేడు.

అయినను తమపై కళంకమును పోగొట్టుకొనుట సంస్థానాధిపతులకు అవసరముగాదా? ఎల్లకాలము అభిప్రాయముల ప్రవాహము నరికట్టుటగాని, తమ నిరంకుశాధికారమును నిల్పుకొనుటకు సార్వభౌమాధికారములపైనను, వారి ఆయుధములపైనను ఆధారపడుటగాని సాధ్యమనని వారు తలచుచున్నారా? ఒకభారతీయుని కీర్తి మరియొకనిది అను సూక్తి తమకును అన్వయించునట్లు వారికి తోచదా? ఇప్పటి సమస్యలపైనను భవిష్యత్సమస్యలపైనను సంస్థానాధిపతులు చక్కగా ఆలోచింతురుగాక. లార్డు ఇర్విసువంటి విశాలహృదయుల సలహాలవచనములు వారికి లేకపోలేదు. వారు అప్రతిహతమైన నిరంకుశాధికారమును చెలాయించుచు అభివృద్ధిని తమ వీలునుబట్టియు, అభిలాషలను బట్టియు జరుగుచుండవలెననెదని శాశ్వతముగా ఉత్తరువు చేయజాలరు. ప్రపంచములో నేడు పరిపూర్ణశక్తియు ప్రజలపక్షముననే యున్నది; వారిహక్కులనుగుర్తించుట అవసరమగునట్లు చేయుచున్నది. మానవుని అభిప్రాయముల అభివృద్ధియు యిపుడు కష్టముల ననుభవించు ప్రజలపక్షముననే గలదు. అభిప్రాయ ప్రవాహమును అడ్డగించుటకుగాని మఱియొక మార్గమున త్రిప్పుటకుగాని ఆక్ట్రాయి పద్ధతి యేదియు ఏర్పరుచబడలేదు. నిజమే; తమ రాష్ట్రములలో అభిప్రాయ ప్రవాహమునకు అటువంటి కృత్రిమములైన కట్టలను వేయుటయందు వారికి యిండియా ప్రభుత్వమువారు ధైర్యముతో తోడ్పడుచున్నారు. ఇంతకంటె తెలివిమాలిన, పనికిమాలిన పనికి కెన్యూటు ప్రభువును నియోగించలేడు.

సంస్థానాధిపతులలో కొందఱు ఉదారహృదయులైనట్టియు; తమగౌరవమును హోదాను, తమహక్కులను అధికారములను నిలువబెట్టుకొనుటకు మార్గములను నిర్ణయించుటకై సిమ్లాలోను, ఢిల్లీలోను, బొంబాయిలోను సమావేశమగుట తమవిధియని అప్పుడప్పుడు తలచునట్టియు ప్రభువులు హక్కులు అధికారములకు తోడుగా తాముచేయవలసిన విధులును గలవనుమాటను కావలెనని మఱచుటచే వారి తరగతివారికే చెఱుపుకలిగించుచున్నారు. వారిభవిష్యత్తునకు హద్దులనువేయు సమస్యలో యిదియొకయంశము. ప్రభువులందరు గాని వారిమంత్రులుగాని యీవిషయమునుగూర్చి ఆలోచించినట్లు లేదు. బహుశా వారు దానిని అంతరాత్మలో నుంచుకొని యుందురు. బహిరంగమైన సాంఘికశక్తులు, అప్రతిహతములైన రాజకీయాభిప్రాయములు యిపుడు దేశమందు విచ్చలవిడిగానున్నవి. అవియన్నియు తుదకు ప్రజలపక్షముననే యున్నవనియు, తాము సరియైన ప్రభువులవలె సంతృప్తులగు ప్రజల అనురాగముపైగాక విదేశ ప్రభువులయొక్క దయా దాక్షిణ్యములపై ఆధారపడు చున్నామనియు సంస్థానాధిపతులును గ్రహింపవలయును.

టౌన్ హాల్ మహాసభ సంస్థానాధిపతులకును సంస్థానప్రజలకును బ్రిటిషు యిండియా ప్రజలకును నిర్బంధముల నేర్పరచుటకు బదులు పైజెప్పినటువంటి సమస్యలను ఆలోచించుట యుక్తము.



---

గోలకొండ పత్రిక
శ్రావణనామ సం॥ వైశాఖ శు॥౧౫
సోమవారము

# తాబీ కిస్తు మాఫీ

సాధారణముగా ప్రజానాయకుడుగాని, ప్రజావత్ పత్రికగాని సంస్థానములకు సంబంధించిన విషయములను గూర్చి విమర్శచేయవలసి వచ్చినపుడు బ్రిటిషు యిండియాతో పోల్చి అక్కడికంటె చాలాహీనస్థితి యనుచుండుట యిప్పుడు వాడుకయైనది. ఆ వాడుకలో నున్నవారికి ఈమధ్య ఆర్థిక దుస్థితివలని బాధ ఎక్కువగా ఉన్నప్పటినుండి మ. ఘ. వ. ప్రభుత్వమువారు మనరాష్ట్రమందలి బీదరైతుల కష్టములను కొంతవరకైనను తగ్గించుటకై అవలంబించుచున్న 'కిస్తులబరాయిందా, మాఫీల' విధానము కొంతవరకైనను ఆశ్చర్యము కలిగించియుండవలెను. ఇప్పుడు బ్రిటిషుయిండియావారే తమ రైతుల విషాదావస్థను వర్ణించుటకై సంస్థానములను ఆదర్శముగా పేర్కొనుటకటస్థించుచున్నది.

బ్రిటిషు యిండియాలో ప్రజాపాలనము కొంతవరకైనను ఉన్నదనిపేరు. కాని అక్కడి ప్రజలకు ప్రజాభిప్రాయము ఆదరింపబడుచున్నదను తృప్తిమాత్రములేదు. కొన్ని కొన్ని విషయములలో ప్రజాప్రభుత్వము లేకున్నను మన రాష్ట్రమందే ప్రజాభిప్రాయము ఎక్కువగా ఆదరింపబడుచున్నది. మదరాసు శాసనసభవారు మద్రాసురాజధాని యంతటను రైతులకు నూటికి రూ ౨౫ ల వంతున భూమిశిస్తులను మాఫీచేయవలసినదని ప్రభుత్వమువారికి శిఫారసు చేసియుండిరి. కాని వారుకోరిన మాఫీలు ప్రజలకు లభించలేదు. మనరాష్ట్రపు రైతులు భూమిపన్నులు చెల్లించవలసిన కాలము సమీపించుచుండగా "ఎట్లా యీసంవత్సరము శిస్తులు చెల్లించుట" యని భయపడుచుండిరి. మ. ఘ. వ. ప్రభుత్వమువారు వెంటనే ఈ ఫసలీ ఆబీపంటలో రూ. ౧కి ౪ అణాలవంతునను, ఖరీఫుపంటలో రూ. ౧కి ౨ అణాలవంతునను మాఫీనొసగిరి.

దానిపై కొందరు ఆబీసేద్యములేక తాబీమాత్రముగలవారు తమకేమియు మాఫీదొరకనందుకు దుఃఖించుచుండిరి. ఈవిషయమై కొందరు రైతుల మొఱలను, మాకుచేరినవాటిని మేమిదివరకు మాపత్రికలో ప్రకటించియుంటిమి. ఇపుడువారి మొఱలును ఆదరింపబడినవి. ఆబీపంటపై ఒసగబడిన మాఫీలవలన లాభము పొందజాలని రైతులకు రూ. ౧కి ౪ అణాలమాఫీని అనుగ్రహించుచు మ. ఘ. వ. నిజాంప్రభువుగారు ఫర్మానును యిచ్చినారు. ఈమాఫీ, నోరుతెరచుకొని యుండు చాతకపక్షులకు వర్షజలమువలె, ఆశతో తాబీశిస్తునందు మాఫీకై కనిపెట్టుకొనియున్న రైతులకు ఆనందము నీయగలదు. వాస్తవములో మ. ఘ. వ. ప్రభుత్వమువారు మొత్తము భూమిశిస్తులో నూటికి ౨౫ వంతుననైనను మాఫీనొసగవలయునని ప్రజాభిప్రాయమై యుండెను. ఆ అడిగినదానికి యింతమాత్రమైనను కోరిక నెరవేరుటచే రైతులభయము కొంత ఉపశాంతించగలదు.

---

## జాగీరు రైతులు పొందిన సాహాయ్యము

మ. ఘ. వ. నిజాంరాష్ట్రమంతయు ఒక్కరాష్ట్రముగా భావించబడుచున్నపుడు, ఖాల్సా భాగమే వేఱు, జాగీరులకు వాటికి ఎంతమాత్రమును సంబంధములేదు అని చెప్పినను ఆమాట పనిచేయునని ఎవరును తలచజాలరు. ఖాల్సాయిలాకాలోకంటె జాగీరులలో ప్రజలకు నిర్బంధములు, అధికార దుర్వినియోగ భయములు ఎక్కువ. చిరకాలము వారోర్చుకొనియుండిరి కాని ఈ ఆర్థికదుస్థితికాలములో ఆ ప్రాంత నిరంకుశ పద్ధతులు వారి భారమునెక్కువజేసినవి. అందువలననారు ఎప్పటివలె ఊరకుండలేక తమకష్టనివారణకై ప్రయత్నింపసాగిరి. తమ యజమానులగు జాగీర్దారులవద్ద మొఱలు నిష్ఫలములయ్యెను. అంతట జాగీర్లు మ. ఘ. వ. ప్రభువుగారి రాష్ట్రములో చేరినవికదా; వాటిపై మ. ఘ. వ. ప్రభువుగారికి అధికారము కలదుకదా అని ఆలోచించి జాగీరురైతులు నిజాంప్రభుత్వమువారివద్ద తమ కష్టములను తెల్పుకొనుటకు ప్రారంభించిరి. తర్వాత పత్రికలలోను వారికష్టములు తెలియజేయబడినవి.

మ. ఘ. వ. నిజాంప్రభుత్వమువారు వెంటనే జోక్యము కల్పించుకొనుట యుక్తముకాదని తలచినట్లున్నది. కొన్నికొన్ని జాగీరులవిషయములో రైతులనుండి ప్రత్యేకప్రార్థనలు వచ్చినపుడు ప్రభుత్వమువారు ఆవిషయములలో తమపలుకుబడిని వినియోగించుటవేఱు; జాగీర్లకన్నిటికిని అన్వయించునట్లు ఒకవుత్తరువును చేయుటవేఱు. జాగీర్దారుల సంఘమువారు జాగీర్దారులు వారివారి జాగీరులలో పరిస్థితులనుబట్టి రైతులను తగిన మాఫీల నొసగవలసినదని జాగీర్దారులకు శిఫారసుచేయుచు తీర్మానముచేసినారు. కొన్నిజాగీరులలో కొద్దియో గొప్పయో మాఫీలొసగబడినవి. కాని అనేకులు జాగీర్దారులు తమకు రావలసిన భూమిశిస్తును పూర్వమువలెనే రాబట్టుకొనుటకై ప్రభుత్వమువారి సాహాయ్యమును కోరుచున్నట్లు ప్రభుత్వమువారివలననే తెలియుచున్నది.

ఈవిధముగా ప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనుటకు ఇవుడు అవకాశము దొరకినది. అందువల్లవారు "ఖాల్సాలో ఏప్రకారము మాఫీయొసగబడినదో ఆప్రకారము మాఫీలను తమ రైతులకు యిచ్చినట్టి, లేక యిచ్చుటకంగీకరించినట్టి జాగీర్దారులకు మాత్రమే జిల్లాభూమ్యాదాయశాఖాధికారులు వారివారి భూమిశిస్తులను వసూలుచేయుటలో తోడ్పడవలసినదని ఒకవుత్తరువును యిపుడుచేసినారు. ఉత్తరువు సంపూర్ణవివరములు స్థలాంతరమున ప్రకటింపబడియున్నవి. దీనివలన పలువురు జాగీర్దారులు ఈ ఉత్తరువులో చెప్పబడిన సౌకర్యమును పొందుటకైనను ఖాల్సా ప్రభుత్వమువారు ప్రకటించినంత మాఫీని ప్రకటించగలరు. మ. ఘ. వ. ప్రభువుగారు జాగీర్దారుల కమిటీతీర్మానమును అభివందించుచు చేసిన ఫర్మాను అనేకజాగీర్దారులను మాఫీల నొసంగుటకై ప్రోత్సహించవచ్చును.

అయినను ప్రభుత్వమువారి సాహాయ్యము నకోఱకయే తమతమ రైతులనుండి తామే బలాత్కారముగానో, బెదరించియో పూర్వపుశిస్తును సంపూర్ణముగా వసూలుచేసికొనుటకు సాహసించు జాగీర్దారులు కొందరుండవచ్చును వారిజాగీర్లలో రైతులగతియేమి? ఇంతకంటె కఠినముగా శాసించు అవసరములేకుండ జాగీరారులు రైతుల కష్టములను తీర్చవలసినదను ప్రభువుగారిఫర్మాను వచనమే దీనికి సమాధానమని నమ్మవచ్చును. జాగీరురైతులు దయామయులగు ప్రభువుగారి ఫర్మాను ఆచరణలో పూజింపబడునట్లు తమతమ జాగీర్దారులను కోరి కష్టములనుండి గట్టెక్కెదరుగాక! ఒకవేళ ఫర్మాను ప్రకారము రైతుల కోరము తీరని జాగీరు ఏదియైనను మిగులుచో దాని సందర్భము మ. ఘ. వ. ప్రభువుగారిదృష్టికి వచ్చుచో తప్పక న్యాయము కలుగగలదు.

---

## దుఃఖసమయములో సంతోష సూచనలు

### ప్రాణధన నష్టకరములగు మందుగుండులు

### మ. ఘ. వ. ప్రభువుగారి ఫర్మాను

౧౩౪౩ హి. జీ సఫరు ౧౦ వ తేదివాడు మ. ఘ. వ. శ్రీనిజాం ప్రభువుగారి దిగువఫర్మాను ప్రధానామాత్యులగు మహారాజా సర్ కృష్ణప్రసాదు బహదూరుగారి యాజ్ఞచే తే౹౹ ౧[illegible] వ తేదినాటి అసాధారణ జరీదాయందు ప్రకటింపబడెను:—

"వాడుక ౧౩౪౩ హిజ్రీ మొహర్రం ౧౦వ తేదినాటి ఫర్మానుకు వ్యతిరేకముగా "పీరా" దివసములకు పూర్వమే అనగా మొహర్రం ౫వ తేదినాడు బీదకునందు జరిగిన జమాల్ బహాదు ఉరుసునందు సంగీతసభ జరిగెననియు, నగరమునుండి యెన్నియో మణుగుల మందుగుండు సామగ్రి తెప్పించి కాల్చబడెననియు రాష్ట్రీయ పత్రికాపఠనమువలన విదితమైనది. మందుగుండు కాల్పుటవలన ప్రస్తుతము సంభవించుచున్న ధనప్రాణనష్టము లోకమునకు తెలియనిది కాకపోవుటచేతను, ఇదిఆపదలతో గూడినదై యుండుటచేతను, యిట్టి ప్రదర్శనము ఉరుసులందు జరుపుట యోగ్యము గాదు. గనుక రాష్ట్రమందు సమస్త ప్రభుత్వ దృష్టియందు గలదు. కావున మందునందలి యీప్రదర్శనములను తక్షణమే యాపివేయవలయును, ఈవ్యయమొత్తము బీదలకు అన్నదానము, వస్త్రదానము నొసర్చుట మొదలగు ప్రజాహితకార్యములందు వెచ్చింపవచ్చును. ఒకవేళ ప్రభుత్వ ఫర్మానులు, యాజ్ఞల (సాధారణ, అసాధారణ జరీదాయందు ప్రచురింపబడినట్టి) ఉల్లంఘన విషయములు జరిగినట్లు నిర్ధారణ యగుచో వానిబాధ్యత సంబంధ శోధ్యోగులపై నుండును. మతకాళ్ళవారు దీనిని గమనించుట విహిత ధర్మమునందు చేరినదై యున్నది.

"పీరా" దివసముల లోపుగా యిస్లాము మతస్త్రీయులు శృంగార వస్త్రములను ధరించుట, సంతోషకార్యములను సలుపుట పాపమైనంతవరకు నిషేధించవలయును. ఇది సంతాపము తెలియుపట్టినకాలము. ఈవిధమగు ప్రదర్శనములు పండుగనుపట్టి యందును, సంతోషోత్సవములందును వాడుకలోనికి వచ్చును.

ముఖ్యముగా నిట్టి ముఖ్య గొప్ప సంతాపకరమైనట్టి సమయమునందు యెంతకాలేశివరకు తమ్మెవరియే నూనవత్యక్రియే గాక మక్కాయందుగల మల్లాలును హృదయవిదారకమగు నిర్మృత్యాంతముపై (అనగా ఆషూరా దివసమునందు) దుఃఖమును తెలిబుచ్చిరని "ఎహాదీసు సహాయ్యా" వలన విదితమగుచున్నది. దీనినిగూర్చియే ఖాజా అల్లీ గారొక గీతమును రచించిరి. క్రిష్మటి పిరి ఫార్సీగీత క్రముల్లేఖింపబడెను, ఇది అసాధారణ జరీదాయందు ప్రకటింపబడవలయును.

మ. ఘ. వ. శ్రీనిజాంప్రభువుగారి
సంతకము.

## ఈస్టు అండ్ వెస్టు కార్పొరేషను వ్యవహారము

మొదటితరగతి నగర న్యాయస్థానపు న్యాయాధిపతు లగు మౌల్వీ మహమ్మదు అబ్దుల్ వహాబు ఖాన్ సాహెబ్ సమక్షమున ఈస్టుఅండు వెస్టు కార్పొరేషన్ సంబంధమైనప్రయత్న మోసగము మీదు గత శేదివాడు విచారింపబడెను. ఇందు ఘ రామి, జైదీ అను విద్ధురు నిందితులైయున్నారు, వీరిపై మౌల్వీ అలీమొహిద్దీన్ సాహెబ్ వకీలును మోసపుచ్చి ద్రవ్యమును గైకొనిర నునేరము మోపబడియున్నది. నిందితులిద్దరును న్యాయస్థానమునకు కొనిరాబడిరి.

మౌల్వీ అలీమొహిద్దీన్ సాహెబ్ తమవాఙ్మూలమునందు వీరు (నిందితులు) తమ్మెట్లు మోసపుచ్చినదియు వివరముగా తెలిపి యీ వాఙ్మూలము మధ్యమందిట్లు నుడివిరి:—

"నేను ౧౯౨౫ సంవత్సరములనుండియు న్యాయవాదవృత్తి నొనర్చుచున్నాను. జైదీ, షర్మామీలు నాకు పరిచయులే. ౧౯౪౨ జూన్ ౨౦ వ తేదీనాడు హాఫిజు మహమ్మదు ఇబ్రాహీంసాహెబ్ హైకోర్టువకీలు ఎం. ఎం. షర్మామీనితనతోడ తీసికొనివాకడ కేతెంచిరి. నాకువారి పరిచయ మొనరించిరి. వీరు ఈస్టుఅండు వెస్టు కార్పొరేషన్ ప్రతినిధులని నాకు తెలిపిరి. అందుపై నేను ఎం.ఎం. షర్మామీని కార్పొరేషను యొక్క వివరము లన్నియు తెలుపకోరితిని. పిమ్మట షర్మామి నాకు కార్పొరేషన్ నిబంధావళిని ప్రకటనలను నొసగెను. వీరువాతో గాంధీ గారియుద్యమమువలన హిందువులు వాణిజ్యమునను స్వస్తి చెప్పియున్నారనియు, మహమ్మదీయులీ సమయమున వాణిజ్యాభివృద్ధినొనర్చుకొనుటగొప్ప లాభదాయకమనియు. దీనిపోషకత్వభారము సర్ ఆగాఖాన్ గారు వహించి ఒకకోటిరూపాయలవిలుగల వాటాలుకొనిరనియు, పదికోట్ల మొత్తము పెట్టుబడితో నిసంస్థ స్థాపింప బడెననియు, అంకోల్సు, మాంచెస్టరు కంపెనీలతో నీసంస్థద్వారగాక మరేసంస్థయు తనవస్తు సముదాయము నొసగరాదని యొడంబడిక గావించుకొన బడినదనియు, నిందితుడగు తాను బ్రిటిషు ప్రభుత్వోద్యోగిననియు. కార్పొరేషను వారు తనను రప్పించుకొనిరనియు, ఈ కార్పొరేషన్ వ్యవహారములు సంపూర్తియైన పిమ్మట తాను తిరిగివెళ్లెదననియు, తెలిపెను. ఇంతియగాక అంకోల్సునుండి కంపెనీకి వస్తువులుచేరినవనియు, ఢిల్లీయందు దుకాణముగూడ నెలకొల్పబడినదనియు నితడు నుడివెను. అందుపైనేను కంపెని డైరక్టరు నగుటకు సమ్మతించి వేయిరూప్యముల విలగల వాటాలనుకొని పై మొత్తమునకు మున్సిరాబాదు సెంట్రలు బ్యాంకునకు చెక్కు నొసగితిని. తరువాత కార్పొరేషన్ శాఖ (ఏజన్సీ)ను గూర్చి సంభాషణజరిగెను. ఈ మధ్యకాలమునందు నేను మరి పదిహేనువందల రూప్యములనొసగితిని. ఏజన్సీ విషయమున నేను యిద్దరు అనుభవశాలురను ఢిల్లీకి తోలితిని. కాని అచట వస్తువులు లేవనియు, కంపెని యుద్దేశ్యము మోసముచేసి ప్రజలచే ధనమును గైకొనుటయే యైయున్నదనియు తెలిసికొంటిని. ఈ విషయములను పిమ్మటగూడ నేను కంపెనిని గూర్చిన పరిశీలన గావించుచునే యుంటిని. కాని పరిస్థితులు సంతృప్తికరముగా లేకుండుటచే సంగతి సందర్భములను రక్షకశాఖ వారికి తెలియపరచి జైదీ, షర్మామీలను అరెస్టు చేయించితిని."

—

## హైదరాబాదు బాంబు అభియోగము

### నిందితులు విచారణనాపుటకు ప్రార్థించుట

—

ఈ నెల ౧౦ వ తేదీనాడు నగరన్యాయస్థాన తాత్కాలిక న్యాయాధిపతులగు మౌల్వీ ముస్తఫాలీసాహెబ్ సమక్షమున హైదరాబాదు బాంబు అభియోగ విచారణజరిగెను.

త్వరలో తమ పదవిని స్వీకరించనున్నట్టియు, ప్రస్తుతము సెలవుపైనున్నట్టియు న్యాయాధిపతి వచ్చునంత వరకు విచారణ నాపియుంచవలయునని నిందితులపక్షమున కోరబడుటచే విచారణ నిలిపివేయబడెను.

ఈ అభియోగమునందు సయ్యదు అహ్మదు, సయ్యదు మహమూదు, సయ్యదు గౌసు, అమీనుఖాన్ అను నలుగురు నిందితులుగా గలరు. సయ్యదు అహ్మదుపక్షమున హాకీం సయ్యదలీసాహెబ్ హైకోర్టువకీలును, మిగత నిందితులపక్షమున ఎం. ఏ. బర్కత్‌సాహెబ్ హైకోర్టు వకీలును పనిచేయుచున్నారు.

రహస్యాపరాధ పరిశోధకశాఖ పక్షమున సదరమీనా అగు మౌల్వీ ఫజలురహమానుఖాన్‌సాహెబ్ కోర్టు ఇన్‌స్పెక్టరులగు మౌల్వీ గియాసుద్దీన్‌సాహెబ్‌ను పనిచేయుచున్నారు.

—

## పూర్వగాథలు

—

### "లక్ష్మణరాయ పరిశోధక మండలి"

—

శ్రీ శేషాద్రి రమణకవులలో నొక్కరగు శ్రీదూపాటి శేషాచార్యులవారు మండలిపక్షమున పరిశోధన పర్యటనము సలిపి, వారుదర్శించిన పలువిధగ్రామముల వృత్తాంతములను తెలుపుచు చక్కని నివేదికను వ్రాసియుండిరి. అవివేదికలోని వృత్తాంతములు ప్రకటింపబడుచున్నవి;

(గతసంచిక తరువాయి)

### బూరుగుగడ్డ

ఈమంటపమునకు తూర్పువైపున (తిరుమంటపడి) వంటశాలయున్నది. ఆలయము దక్షిణద్వారము గలిగియున్నది. ఆలయద్వారమునకు బ్రక్కనొక శాసనస్తంభము పాతియున్నది. దీనికి నలుప్రక్కలను వ్రాయబడియున్నది. ఇదిసున్నముచే నిండియున్నది. శాసనమునందలి సంగతినిగ్రహింపనెంచి స్థానాచార్యులవారు సున్నము గొట్టించియు మైనముదెప్పించి యద్దియు నెంతయో ప్రయత్నించిరట. కాని సంపూర్ణముగ దానిలోనిసంగతిని గ్రహింపజాలరైరి. మొత్తమున కీశాసనాధారముచే పూర్వమునుండి దేవుని కైంకర్యములకు నేర్పడి సర్కారులో కలిసిపోయి నయగ్రహారమును దిరిగి పొందినారు. ఆలయమున వెనుకప్రక్కనొక దిగుడుబావి యున్నది. దానిలోనొకపిల్లబావియున్నది. ఇందలినీటిచేతనే అర్చకులీస్వామి కారగింపుల బచనమొనర్తురు. ఈ బావిమిక్కిల చిన్నదియు, ననంఖ్యాకములగు గబ్బిలములతో క్రిక్కిరిసి తత్పురీషములచే నేహ్యమైనతీర్థముతో నొప్పుచున్నది. గర్భాలయమునకు చుట్టును నాళ్వారుల విగ్రహములున్నవి. ఇవి సామాన్యపు రమప్రమాణము కలవై మిగులనందముగానున్నవి. ఆలయపుకట్టడము దక్షిణాది తిరుపతి మొదలైన యాలయములవలెనున్నవి. కట్టుబడినిబట్టి పురాతనకాలపు కట్టడమని నవకాశములు కలవు. ఆలయగర్భభాగము మిక్కిలివిశాలమైయున్నది. ఆదివరాహస్వామి విగ్రహము మిగుల సుందరమైనది. దీనిప్రక్కనున్న యాండాళువిగ్రహము పురుషప్రమాణముగలదైయతిప్రభావముచే నొప్పుచున్నది.

ఆలయమునకు దక్షిణముగా నొకశివాలయపు గర్భగుడియున్నది. ఇందే విగ్రహమును లేదు. కాని పగిలిపోయిన పానవట్టము మాత్రమున్నది. ఆలయమునకు చుట్టు నొకగజమెత్తున గోడవలె రాళ్లమర్చబడి యున్నవి. ఈ రాళ్లలో నొకనాగుబాముగల రెండుగజముల రాయియున్నది. ఇదికొంతభాగము భూమిలో పాతియున్నది దీనికి వెనుక సన్ననియక్షరములతో శాసనము చెక్కబడియున్నది. ఈరాతినితీవ్వి శాసనప్రతిబింబమును తీసికొంటిమి. రాయివెనుక భాగమంతయు నటనటపుచ్చి గుంటలు పడియుండుట ప్రతిబింబము చక్కగా రాలేదు. రాయిసన్నగానున్నది. దీనిప్రక్కను చిసలంకెలబావియని పిలువబడు చిన్నది గుడిబావిపూడిపోయియున్నది. గుడియును బావియును పురాతనపు కట్టడములే. ఇచ్చటికితూర్పుగా నొకఫర్లాంగుదూరమున పెదలంకెలబావియని పిలువబడు మఱియొకదిగుడుబావియున్నది. అదియు పూడిపోయియున్నది. కాని దీనియందలినీరు నుంచితీర్థముగను గ్రామస్థులు కొలదికాలముక్రిందటివరకుగొనిపోవుచుండిరి. ఈ బావియొద్దన నొకనాగుబాముగల రెండుగజముల పొడవుగల నొకరాయియున్నది. ఇదియు చిసలంకెలబావికడనున్న రాయియు నొకతీరుగనే యున్నవి. వానిపై చిత్రింపబడిన నాగుపాములు రెండునుకూడ నొకేతీరున నేయున్నవి. దీని వెనుకప్రక్కనుకూడ రెండవదానినిబోలిన సన్నని లిపితో శాసనము చెక్కబడియున్నది. కాని యిది భూమిలోపూడిపోయియున్నది. పైనొక మువ్వాతికగజముమాత్రము గానవచ్చుచున్నది. శాసనమంతయు బయలుపడువరకు రాతిచుట్టును త్రవ్వింపనారంబించితిమి. ఇంతలో గ్రామపట్వారిగారగు నరసింగరావుగారు దయచేసి కొంతయడ్డుపరచిరి. వారికిదగునసమాధానము చెప్పితిమి. వారియూహ యిట్టిశాసనములక్రింద ధనముండుననియు నదిసంగ్రహింప త్రవ్వించుచుంటిమనియు నైయున్నది. ఇందుల కనుగుణ్యముగా పూర్వమొకనాటిరాత్రియిచ్చటి రాతినిద్రవ్వి క్రిందనున్న ధనపుపాతర దీసికొనిపోయిరనియు మఱునాడా ప్రదేశమును చూచితిమనియు పాతరగల ప్రదేశముగా గన్పడినదనియు చెప్పిరి. మేమువారికినదంతయు వారిస్వాధీనపరచెదమని యొప్పించి త్రవ్వించితిమి. అబండమాత్రము బైటపడకయె దుకాని యడుగున నొకబండయుండి గడ్డపారవేసిన నెదురు తిరుగసాగినది. అనివార్యమైన యాయడ్డుపాటును దొలగింప నశక్తులమై యక్షరములు బయటబడినంతవరకు ప్రతిబింబమును చేకొంటిమి.

ప్రస్తుత దేవాలయ స్థితిగతులు శోచనీయముగ నున్నవి. పూర్వపు గ్రామమీయాలయమునకు దక్షిణముగానున్నటుల దోచుచున్నది. పెదలంకెబావికడ నొకశివాలయమున్నగుర్తులు కానవచ్చుచున్నవి. నందివిగ్రహమొకటియు నిటనుడియున్నది. చుట్టును నాయాలయమునకు సంబంధించినబండలు పడియున్నవి. ఒకద్వారమున్నది. ద్వారమునకు నొకప్రక్కనొక పానవట్టమున్నది. దీనిబట్టి యిటశివాలయమున్నదని చెప్పవచ్చును. ఆలయములోపలిభాగమనబడుప్రదేశమున నొక తాటిచెట్టునకు చుట్టుకొనబడియున్నది. ఈ తాళవృక్షము సుమారేబదివత్సరముల వయస్సుగలది గానుండవచ్చును. పాతయూరుగలదని యూహింపబడిన ప్రదేశమునొక చెరువున్నది. ఆచెరువుకట్టమీద నొక శివాలయము పడిపోయియున్నది: మఱియొకటి రెండుశక్తిగుళ్లు గూడశిథిలావస్థయందున్నవి· ఈచెఱువుచుట్టునున్నకొండరాళ్లమధ్య మధ్యకట్టగా పోయబడినదైయున్నది. చెరువుప్రదేశము మిగులపల్లమై నిరెక్కుడుగానిల్చునదిగానున్నది: అందుచే నెండకాలమున గూడ సమృద్ధిగాజలమున్నది. చెరువునీరుపారిసప్రదేశమంతయు కృష్ణరేగడనేలయగుట పంటచక్కగాపండునవింటిమి. స్వామివారికున్న యగ్రహార మీచెరువునకు మిక్కిలిసమీపము, ప్రస్తుత మీయాలయయాజమాన్యము స్థానాచార్యులస్వాధీనమందున్నది.

—

## హైదరాబాదు బజారు ధరలు

(కోడూరపు లక్ష్మీనరసయ్య ఉస్మాన్ గంజ్)

28—5—1934

| | | | |
|---|---|---|---|
| గోధుమలు:-జెల్లాల్యమొదలుపల్లా1కి | | రు12 | 8 |
| బియ్యము:—దొడ్డువి | మొ | 10 | 8 |
| సానకరాంలు కొత్తవి | మొ | 11 | 8 |
| | వరకు | 12 | 0 |
| డిటో | పాతవి | 12 | 8 |
| | వరకు | 13 | 0 |
| ,, క్రిచిసాంబారులు | కొత్తవి,, | 13 | 0 |
| డిటో | పాతవి | 13 | 4 |
| | వరకు | 14 | 8 |
| ,, రామసాగరాలు | కొత్తవి | 11 | 8 |
| డిటో | పాతవి | 12 | 4 |
| కందులు | పెద్దవి | 10 | 8 |
| | చిన్నవి | 9 | 8 |
| కందిపప్పు | పెద్ద మొ | 14 | 4 |
| | వరకు | 15 | 0 |
| | చిన్నవి | 13 | 8 |
| | | 14 | 0 |
| పచ్చపెసలు | | 8 | 12 |
| | వరకు | 9 | 0 |
| పెసలపప్పు | | 14 | 8 |
| నల్లపెసలు | | 6 | 0 |
| మినుములు | | 8 | 12 |
| మినప పప్పు | | 14 | 0 |
| అలసలు | | 4 | 12 |
| జొన్నలు | | 9 | 4 |
| శిరిసెనగలు | | 12 | 4 |
| పుప్పు | | 12 | 0 |
| తవుడు | | 3 | 4 |
| ప త్తిగింజలు | మొ | 6 | 4 |
| అలచందలు | | 8 | 12 |
| అనుములు | | 7 | 0 |
| బటానాలు | | 7 | 8 |
| బెల్లము | | 19 | 0 |
| ఎఱ్ఱచక్కెర | | 18 | 0 |
| | వరకు | 19 | 0 |
| వేరుసెనగ గింజలు చిన్నవి | మొ | 9 | 12 |
| పసుపు | | 14 | 0 |
| | వరకు | 14 | 0 |
| మిరపకాయలు | మొదలు ,, | 60 | 0 |
| | వరకు ,, | 70 | 0 |
| చింతపండు | మొ | 9 | 0 |
| మెంతులు మంచివి 16 సేర్లకు | | 1 | 12 |
| | వరకు | 2 | 0 |
| అల్లం 12 సేర్లకు | మొదలు | 1 | 8 |
| | వరకు | 1 | 12 |
| వేరుసెనగనూనె | సె 12 కి | 2 | 6 |
| నెయ్యి | సె 408 | 46 | 0 |
| | వరకు | 47 | 0 |
| తెల్లగడ్డలు | మొ సె 12 కి | 1 | 12 |
| | వరకు | 2 | 0 |
| ఎఱ్ఱగడ్డలు పల్లా1కి | మొ | 4 | 0 |
| | వరకు | 4 | 5 |
| మద్రాసు చక్కెర | దొడ్డది | 13 | 8 |
| | వరకు | 13 | 10 |
| సెనగలు | మొ | 11 | 0 |
| సెనగపప్పు | మొ | 14 | 0 |

## బెంగాలు మేయరు ఎన్నిక

### కార్పొరేషను హాలులో కలభా

ఇదివరలో జరిగిన మేయరు, డిప్యూటీ మేయరుల ఎన్నికలను ప్రభుత్వమువారు రద్దుపరచినందున తిరిగి ఎన్నికల కొరకు మే ౧౫వ తేది సాయంత్రము సభ యేర్పాటుచేయబడెను. కాంగ్రెసు సభ్యులలో రెండు పార్టీలేర్పడి చెరియొక అధ్యక్షుని ప్రతిపాదించిరి. మహమ్మదీయసభ్యులు సేనగుప్త పార్టీవారితో చేరిరి. సేనగుప్త పార్టీవారు ఫజలుహక్, ఘోషుగార్లను, బోసు పార్టీవారు ఎస్. ఆర్. సర్కారు, బి. యన్. రాయ్ చౌదరిగార్లను మేయరు డిప్యూటీ మేయరు పదవులకు ప్రతిపాదించిరి.

సభాసమయమునకు కొన్ని నిముషములు ముందు బోసు పార్టీకి చెందిన డాక్టరు కె. యస్. రాయిగారు మేయరుగారి యాసన మధిష్టించిరి. ఇంతలో ఫజలుహక్ గారచ్చటికి వచ్చి ఆయాసన మధిష్టించుట కర్హుడు తానని యు ౧౦వ తేదీన జరిగి ఎన్నికలను ప్రభుత్వమువారు రద్దుపరచినను తనను మేయరు పదవినుండి తొలగించలేదనియు కావున రాయ్ గారిని ఆసనమును ఖాళీ చేయవలసినదిగా కోరిరి. రాయ్ గారు ఆసనమును వీడనందున హక్ గారు అచ్చటనే యుండిన మేజాపై ఆసీనులయిరి. అంత గుప్తపార్టీవారొకరు మదనమోహన బర్మనుగారిని సభాధ్యక్షునిగా ప్రతిపాదించిరి. వెంటనే బర్మనుగారు అధ్యక్షపీఠ మలంకరించుటకు తానర్హుడనని రాయ్ గారిని కుర్చీలోనుండి లేపుటకు ప్రయత్నించెను. కాని అట్లు చేయజాలనందున అచ్చటనే నిలువబడి అధ్యక్షుని విధిని నిర్వర్తించ మొదలిడిరి. ఏపార్టీవారి కార్యక్రమమును వారు జరుపగడగిరి. హాలంతయు గందరగోళముగా నుండెను. అంత యస్. కె. ఘోషుగారు అధ్యక్ష నియామకమునకు బోసుపార్టీకి చెందిన బి. కె. బోసుగారిని నియమించిన బాగుండునని సూచించిరి. ఈ సూచనను రెండుపక్షములవారును ఆమోదించి వారికి అధ్యక్షపీఠ మీయబడు సమయములో గుప్తపార్టీకి చెందిన డాక్టరు మైత్రాగారిచే సభను ప్రస్తుతమాపుదల చేయుటకు ప్రతిపాదింపబడి బర్మనుగారిచే అంగీకరింపబడినటుల తెలుపబడినది. రెండవవైపున బోసు పార్టీవారు వారి యభ్యర్థుల యెన్నికలను జరిపిరి. యీవిధముగా ౫ నుండి ౭ గంటలవరకు జరుగవలసిన సభ ౬–౩౦ గంటలకే ముగిసినది. సభ ముగిసినను యిరుపక్షములవారును తమతమ స్థానములందే స్థిరముగా కూర్చుని యుండిరి. కొందరు మహమ్మదీయ సభ్యులు ప్రార్థనల వచ్చుటచే జరిపిరి.

ఈవిధముగా మేయరు ఎన్నికలలో పాటింపవలసిన నిబంధనలను పాటించక ముగ్గురు అధ్యక్షులతో బెంగాలు మేయరు యెన్నిక పూర్తియైనది. ముందు యేమిజరుగునో చూడవలసి యున్నది.

## గాంధిమహాత్ముని హరిజనయాత్ర

### ఉత్కళమున సంచారము

మే నెల ౨౦వ తేది ఉదయమున గాంధిమహాత్ముడు పాట్నానుండి ఉత్కళమునకు బయలుదేరెను. కేంద్రపరాకు ఉత్తరమున ౨౦ మైళ్ళదూరమున బైరిక్కెలుస్టేషనకు చేరువగానున్న చంపపూరు గ్రామమున పాదయాత్రమునారంభించెను. మహాత్ముడు కాలినడకను గ్రామమునుండి బయలుదేరి ఇంపూరు, జయపూరు, భద్రకు మున్నగు స్థలములవెంబడి బాలసోరుకు జూను నెల ౧౦వ తేదీన వెళ్లును. అనగా ౨౦ రోజులలో ౧౩౦ మైళ్లు సంచారముచేయును. బాలసోరులో రెండురోజులు విశ్రాంతి గొనును.

### బొంబాయి రాష్ట్రమున సంచారము

మహారాష్ట్రము

జూను నెల ౧౪వ తేదీకి మహాత్ముడు బొంబాయి నగరమునుచేరి అచట ౫ రోజులుండును. జూను నెల ౧౯వ తేదీ మధ్యాహ్నమునకు పూనా చేరి మహారాష్ట్రమున ౭ రోజులు సంచారము చేయును.

గుజరాతు

జూను నెల ౨౭వ తేదీకి అహమదాబాదుచేరి గుజరాతులో జూలై నెల ౭వ తేదీవరకు సంచారముచేయును. అనాడు మధ్యాహ్నము అజ్మీరు వెళ్లును.

సింధు:—

జూలై నెల ౮వ తేదీకి కరాచికిపోయి సింధుదేశమున నాలుగురోజులు సంచారము చేయును.

### పంజాబు

జూలై నెల ౧౩వ తేది సాయంకాలమునకు మహాత్ముడు పంజాబుచేరును. పంజాబులో ౪ రోజులు సంచారము చేయును.

### సంయుక్త రాష్ట్రములు

లాహోరునుండి సంయుక్త రాష్ట్రములకు వెళ్ళి ౫ రోజులు ఆరాష్ట్రమున సంచారముచేయును. జూలై ౨౨తో సంచారమును విరమించును.

REG. No. N. 45

Reg. No. M. 218

STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy